

శ్రీ ర స్తు.

# రామలింగేశ్వరశతకము.



శా॥ శ్రీమద్వ్యాకృతికాయురబ్దలిపిలోఁ జేదప్పులన్ దిద్దియు
ద్దామాభీలకృతాంతపాశజనిసంతాపంబు సల్లార్చి త
ద్భూమీదేవకుమారు మృత్యుభయముక్తుం జేయు నీనామమే
స్వామీ! నా పెనుప్రాపు, రామవరవాసా! రామలింగేశ్వరా!

మ॥ హర, భూభృద్వరజామనోహర, రిపుప్రాణచ్ఛటాపశ్యతో
హర, బ్రహ్మాండసమూహగేహదుదరా, హాలాహలోష్మార్తిఖి
న్నర రక్షోవరనిర్జరప్రకర సంతాపాపనోదాదరా,
స్మరదుర్గర్వతమఃప్రచండకర, సాంబా! రామలింగేశ్వరా!

మ॥ భవ, భూమీధవపుత్రికాధవ, సుపర్వద్వేషికల్పాయితా
హవ, భగ్నీకృతదుష్టదక్షహవ, సంధ్యాకాలసంరబ్ధతాం
డవ, దీనాశ్రితవర్గబాంధవ, రమానాథేంద్రరాజీవసం
భవ సంకీర్తితసద్యశోవిభవ, సాంబా! రామ ॥

మ॥ కరుణాసేవితబాణ, దుష్టపురవర్గప్రాణహృద్బాణ, దు
స్తగద్దైతేయచయాపనోది నిజకోదండప్రభాగానత
త్పరగీర్వాణ, నిమేషమాత్రచరితబ్రహ్మాండనిర్మాణ, త
త్పరిరక్షాదికళాప్రవీణ, పరమాత్మా॥

మ॥ బలవత్కామమదాది హృద్రిపుమదేభవ్యూహపంచాస్య, కుం
డలిరాట్కుండల రత్నరుగ్రుచిరగండద్యోతపంచాస్య, ని
స్తులకైవల్యపదాభిలాషి మునిసందోహానిశోపాస్య, ని
శ్చల లక్ష్మీకరణప్రశస్యనిజదాస్యా,॥

శా॥ మోహధ్వాంతపతంగ, మౌనిహృదయాంభోజాతసారంగ, ది
వ్యాహివ్యూహవిభూషితాంగ, హతమాద్యద్దైత్యమాతంగ, ప్ర
త్యూహౌఘఘ్ననిజప్రసంగ, శ్రితసాధుశ్రీకరాపాంగ, గం
గాహీరోజ్జ్వలదుత్తమాంగ, గతిసంగా॥

మ॥ కలశాబ్ధిన్ సుధకై సురల్ తరుచుచోఁ గాకోలముప్పొంగ వే
డ్కలరన్ గ్రోలి, సుధన్ సుగాళికిడినావన్నన్ ద్వదీయాశ్రిత
త్వాలయన్ జేసెడునట్టిసత్కృతులకున్ విఘ్నంబులన్ మాన్పిత
త్ఫలముల్గూర్తువటంచనెంతమహితాత్మా॥

శా॥ దారిద్ర్యార్ణవసేతువుల్ప్రణతభక్తవ్రాత జీవాతువుల్
గీరామాధవమాధవైలబిలలక్ష్మీహేతువుల్, ప్రాభజిగో
దారత్మాధగరధాతువుల్ భవ, భవత్పాదాబ్జముల్ గూర్పుమిం

పాడఁగ నాడఁగ మానసంబున మహాత్మా ॥

మ॥ ధరసంసారపరంపరారుజ, కవిద్యామూర్ఛ, కత్యుగ్రహా
జ్వరభారంబున, కన్యదైవతనమస్యాచిత్తవిభ్రాంతిశఁ
సురవానౌషధరాజమబ్బనివ్వైకొండంచు నీనామది
వ్యరసంబిచ్చో క్రుతుల్భవార్తులకుసాంబా॥

శా॥ ప్రారబ్ధాంబుధిలోపలన్ నిబిడచింతాభీషుబద్ధుండనై
పారంబున్ గనలేక వేడుననుబ్రోవన్ రాఁగదే, కాఁగదే
కారుణ్యంబున నాకుదిక్కు వెలయంగానుద్ధరింపంగదే
గారీహృద్యకచాబ్జభృంగ, రిపుభంగా! ॥

మ॥ దయఁజేపట్టిభయంబుమాన్పగదెయంతస్తాపదాహార్తినిం
ద్రియసౌఖ్యోఘమరీచికానుగమనాతిక్రాంతమై మాహసం
చయజాలంబునజిక్కి మృత్యుమృగహింసాజీవసంశంకితా
త్యయమా నాదుమనఃకురంగమునకన్నా॥

మ॥ వయతోడన్ దరిజేర్తువో హృదయసంతాపంబుచల్లార్తువో
యయయముల్ గూర్తువో, గూర్తువాశ్రితులకీవంచున్ భవద్దివ్యప
ద్వయపూజావిధిగాకయే నితరవిద్యల్లేశమున్ నేర నీ
లయూపేక్షించెదవేలనన్ను శ్రితపాలా॥

మ॥ వినవో నామొర, దీనుఁడంచెలుఁగవో, వేఱెవ్వగో ప్రాపకు
ల్లనుబ్రోవంగలరంచుపేక్షనొందురంత ప్రాగ్జనుర్దుష్క్రియా

జనితాఘౌఘవినిందితాత్ముఁడని శిక్షాబుద్ధియోగాక నీ
కనఘా యీకరినత్వమెక్కడిది? సాంబా॥

మ॥ మదమాత్సర్యతిఘూర్ణితాత్ములగు సంపద్యోగ గర్వాంధులన్
మదిరంజిల్లగనిత్యమున్ గొలుచుసామర్థ్యంబు లేదేమియుఀ
ముదమొప్పన్ ననుసీవ కావవలయున్ ముమ్మాటికంచున్ సదా
వదలఀ నీదుపదాంబుజంబుశివ, సాంబా॥

శా॥ క్రూరస్వార్థపరప్రచారులధికారుల్ వారి మెప్పించిన
త్కారంబందుటసున్న; దంభములుపల్కఀ నేర్చుమాయావులా
వారల్పాత్రులు వారిసత్కృతికి మీభవ్యాంఘ్రి సేవారతు
ల్సేరంజాతురె వారినెన్నటికినిన్ శ్రీరామ॥

మ॥ తనునొప్పించినక్రీడిఁగాచె సుతవాత్సల్యంబు సంధిల్లనో
జనముల్! రండు శతాపరాధసహనస్వాంతున్ శివాకాంతునిఀ
దనివారన్ భజియింపుఁడన్యగతచింతల్మానుఁడీయంచుబో
ధనగావింతుఁ గృపాంతరంగితదృగంతా॥

మ॥ కలనైనన్ బరకీయవిత్తయువతీ కాంక్షామహాపాప సం
కలితుండై చెడనీక వేననుమృపాంకా, శైవపంచాక్షరీ
విలసత్పంజర మధ్యసంస్థితు వినిర్భీతుఀ వినీతున్విని
శ్చలుగావించి యనుగ్రహింపు పరమేశా॥

మ॥ భవమున్నంతకుసద్యశంబు నటుపైద్వాస్థ్యసాన్నిధ్యమై

భవముఁ బాయక యుండఁ బ్రోచుటను నీపై భారమంచున్ సదా
శివ, బాలేందుకిరీట, నాలినుమనోజీవంబులన్ నేఁడిటే
భవదాయత్తము సేయువాఁడ శివసాంబా ॥

మ॥ యమహృద్రక్తము యావకంబు, భుజగాధ్యక్షుండు మంజీరమా
కమలారాతియుఁ గందుకంబునట, శ్రీకాంతుండు వేవేలజ
న్మములన్ గానఁగరానివస్తువట, యుష్మత్పాదపద్మంబుది
వ్యమహత్త్వంబు నుతింపఁగాదరమె సాంబా ॥

శా॥ దాంతస్వాంతసరోనిశాంతముల సద్బ్రహ్మాండభాండోత్కరా
నంతైకాంతధురంధరంబమృత సంధానప్రవీణంబునున్
గాంతస్వచ్ఛఘువీశరూపమగు నీకమ్రాంఘ్రిసేవన్ రమా
కాంతుండా కమఠంబుగాఁగలిగె లింగా ॥

మ॥ భయదవ్యాఘ్రమదాంధసింధురవధ ప్రఖ్యాతతేజస్వివై
దయతో బాలకురంగకంబుఁగొని చేతంబట్టు కారుణ్యసం
శ్రయుఁడౌ నీకృపగల్గనేమిటికి దుష్టవ్రాతసంజాతభీ
తియుతిన్ సన్మనుజాళి జాలిపడ ధాత్రిన్॥

మ॥ క్షితిసర్గాదికకార్యముల్ హరిసురజ్యేష్ఠాదిగీర్వాణ సం
తతిఁజేయన్ నియమించి దీనజనసంతానావనానూనమా
నితకార్యైకధురావహత్వమది నిర్నిద్రక్రియన్ దీనికిం
కితరుల్ కారని నీవ చేకుపట తండ్రీ॥

మ॥ అతిదీనుఁడ, మతిహీను, నిత్యభవదీయాంఘ్రిద్వయాదీను, సం
తతదుష్కార్యధురీణు నన్నిటుల నిర్దాక్షిణ్యతన్ బూనిదు
ర్గతిపాల్సేయకుమన్న మన్నవదలిర్పఁడ మున్ను లాతన్ బ్రప
న్నులరక్షించితివన్న రక్షితవిపన్నా ॥

మ॥ అతిసంధానవశుల్సుఖ్ రచితమిథ్యాస్తోత్రను లిగ్రముల్
క్షతసత్కార్యరతుల్సు లఖలత్వాచ్ఛాన్నంధువు లబ్బంధువుల్
చ్యుతనైజార్థములర్థముల్, తరళవిద్యుచ్ఛ్రీప్రాయముల్ ప్రాయముల్
క్షితిని న్నెల్లను గల్ల, కోరనివి నే శ్రీరామ ।

మ॥ ఘనమాయామయమైన మేఘము భవత్కాంతిచ్ఛటన్ మాకను
ల్గనరాఁ సండఁగఁ గప్పినన్ బహుళపంకంబౌ భవంబందు వే
సనుచున్ జారుచు లేచుచున్ బడుచుఁ గ్లేశంబందుచున్నట్టి మా
కనఘా మీచరణంబె సంశరణమన్నా ॥

మ॥ హరికిన్ ముద్దుకుమారుమారు సుకుమారాంభోజరాజీశరో
త్కరమున్ నీపయి వైచినందుకతనున్ గావించి గాండీవ బం
ధురఘాతంబొనరించు పార్థుఁజరితార్థుం జేసితౌ నిర్మలాం
తరవృత్తిప్రవణంబు నీదయ మహాత్మా! ॥

మ॥ అనఘా నీకు సుమోపచారము ఫలాహారంబు గావింప నే
వనధిం గాను సదాత్వదీయపదసేవన్ జేయఁగా మారుతా
శనముఖ్యుండను గాను నీదు విలసచ్చారిత్రముల్నేర్చి ప

ల్కను వాగీశుఁడఁగాను దీనజనరక్షా!॥

మ॥ అనిశంబున్ భవదీయపాదకమలధ్యానామృతాస్వాద సం
జనితానందపయోధిఁ దేలుచు సహస్రబ్రహ్మకల్పంబులో
క్కనిమేషంబుగఁ బుచ్చు నీపరమభక్తశ్రేణి భాగ్యంబుగ
ల్గునె భ్రాంతాత్ముల కెంతయైనను కృపాళూ!॥

మ॥ అరిషట్కంబుపదంబులై, బలవదాశాహమ్మతుల్ రెక్కలై
కరమర్థిన్ విషయౌఘకింశుక వనాగ్రంబందు వాపోవుచున్
బరివర్తించెడు మన్మనోమధుపమున్ వారించి యుష్మత్పదాం
బురుహాంతర్నిలయంబు సేయఁగదె శంభూ॥

మ॥ జనకాన్వేషకుఁడైనబాలుఁడు మహాసంఘంబులోఁ జొచ్చి త
జ్జనకున్ గానక ధూర్తులైనజను లాసల్వెట్టి కొంపోవఁ బో
యినితాంతంబువిపన్నుఁడౌక్రియభవానీశా! భవంబందునిన్
గనకే మోహమదాదులంబడితి నన్నా॥

శా॥ బాలుండాటలవేళఁ దల్లినిఁదలంపంబోక పేరాకలౌ
వేళం దల్లినిఁజేరి కీడనటులో విశ్వేశ! మీభక్తి సేఁ
జాలన్ సంపదగల్గుచో మఱచి దుస్సాధ్యాపదల్గల్గుచో
జాలింబొందిస్మరింతు రైపుమదియీశా॥

మ॥ వరధర్మార్కుఁడుగ్రసంకి గర్జయుకవిధ్వాంతంబుచేతన్ భయం
కరమానీతరి మీపదాంగణదివ్యవృక్షున్ జేసి విశ్వంబు ద్రి

స్రుక్కుచున్నాఁడను; దారిగానను; మహాత్మా! త్వత్ప్రసాదేందుష
ద్రుచిన్ ముక్తిపథంబుఁజూపఁగదె సాంబా॥

మ॥ అనఘా! తల్లిపులుంగు, పిల్లలఁగులాయంబంగుఁదానుంచిపో
యిసరితిన్ ననుసంసృతిన్ విడిచి నీవెందేగ వావయ్యా! త
ల్లినిఁదస్తోత్రములట్టులెడ్డు శశిమౌళీ! నిన్ననన్ గల్గునో
యని నాస్వాంతము వేచియున్నదిగదె వాన్న॥

శా॥ దిక్కుంబొందయదాఁచి, బిడ్డలసపత్నీమాతకొప్పించిక
ష్టవ్యాపారతనున్న తండ్రిక్రియ సంసారాంబుధిన్ ద్రోయుమం
చవ్యక్తస్నులమైనబిడ్డల మహామాయకొప్పించుట
ల్భావ్యంబెగద విశ్వపాలనవిలోలా॥

మ॥ గొలిదుష్టాత్ములచేత సాధులవిపత్తుల్ పొందఁగానిచ్చియ
వ్వలదండింతువు నీవుదుష్టులను మున్వారింపఁబోవేమొ; బె
బ్బులివేఁటాడెడువాఁడు బోనునసజంబున్ గట్టిదానిన్ దినన్
బులిఁజక్కాడెడు చందమాయెనిది శంభూ!॥

మ॥ అవనిన్ గర్బరసాయనంబులగు మిథ్యావాక్యముల్ సెప్పికా
తవ సౌహార్దసమాఖ్యసోలిన్ లనిద్రల్ వచ్చి ధూర్తాళిసా
ధువులన్ నమ్మినవారిఁజేరి వెసగొంతుల్గోసి హింసింపని
కవు నే యిట్టులు పేకు సేయఁశితకత్రా!॥

మ॥ ధరనైనాతపతప్తుఁడై పథికుఁడంటర్లీనదుర్వ్యాళకో

టరమా వృక్షము జేరి దాని పెనునీడన్ గున్కి తద్వ్యాళభీ
కరదంష్ట్రాహతి నంతమొందునటులౌ కార్యార్థులై వంచకో
త్కరవార్తల్నెరనమ్ము సాధుజనవార్తల్॥

మ॥ అమితక్రూరవిషోగ్రపుచ్ఛమలికిన్ వ్యక్షేతరత్క్ష్వేళదు
ర్దమదంష్ట్రిల్ ఫణికిన్ నిశాతనఖధారల్ ద్వీపికిన్ బోలెదు
ష్టమనుష్యాళికిఁ సంగి తన్యజనహింసాశక్తి; తద్వారణ
క్షమమున్ జేయఁగదయ్య సాధుగణమీశా॥

మ॥ మునుస్నేహించుట గొంతుగోయుటకు; నామోసంబు పైలైనఁగో
పనులై యుద్ధతిఁ జూపు, టయ్యది ఫలింపన్ జాలకున్నన్ ఖలం
బునకున్ సంధినిఁ గోరు, టయ్యది వృథాపోవన్ బరుల్ దమ్ముఁ గొ
ట్టినయట్లేడ్చుట దుర్జనాస్త్రములు తంద్రీ!

మ॥ పరులన్ వేడుచు దుర్జనుల్ పరులచే బాధింపఁగాఁ బడ్డవై
ఖరి దీనోక్తులఁ బల్కి ధర్మసభలన్ క్ష్మాపాలురన్ మోసపు
త్తురు గా కివ్వఁడు డాఁగనోపునిఁక నీదుర్వారసర్వాంతరం
గరహస్యజ్ఞతగల్గుదృష్టికి నతర్క్యా!॥

మ॥ వ్రణమున్ మున్నదిగించి ధమహితుఁడౌ వైద్యుండు ఖండించునై
పుణిలోఁ బన్ గుటిలాంతరంగులతలంపుల్ గొంతసంపత్తిను
ల్బణమున్ జెందఁగనిచ్చి యాపయిని మూలచ్ఛేదమున్ జేతు వు
న్నిఁ దేహంబు సుఖింపఁ జేయ నకలంకా॥

మ॥ భవమార్గంబునఁబోయి ముక్తిబదమున్ బ్రాపింపఁగాఁగోరుమా
నవులన్ దారులుగొట్టి ధైర్యధనమంతన్వైరిచోరుల్ దురం
తవిధిన్ గొల్లలుకొందురంపఁగదె తద్రక్షార్థమై జ్ఞానశ
స్త్రవిరాజద్భవదీయ భక్తిపరమేశా!॥

మ॥ అరిరాట్పాలితమైన యింద్రియదిగంతాళిన్ మనోశ్వంబుద్రి
మ్మరుచోఁబట్టఁగవచ్చునట్టిరిపులన్ బ్రాంచద్వివేకాసితో
నిరతిన్ జీల్చి మనంబుజ్ఞానసపవహ్నిన్ వ్రేల్చి కైవల్యరా
జ్యరమన్ జెందుటె యశ్వమేధమఖిలజ్ఞా॥

మ॥ అనఘా! వైద్యునిఁగాంచిరోగి వెసనాకౌషధంబునీమందుఁదె
మ్మనుటేలా? తనయార్తిఁ దెల్పికొని చేయందించినన్ జాలు; న
ట్లనె సద్భక్తులు నిన్ను జేరి వరముల్ప్రార్థింపకో దేవ! తోఁ
చినరీతిన్ మము బ్రోవుమందురుగదన్నా॥

మ॥ త్వరమై బిడ్డనునిద్రవుచ్చి సతియాతన్వంగితాఁజీవితే
శ్వరు సేవించువిధంబునన్ మిగులనజ్ఞానాత్మకంబౌ మనం
బురహిన్ యోగసుషుప్తియందునిచి శంభూ! యుష్మదీయోజ్జ్వల
చ్చరణాంభోరుహ సేవఁజేతుఁ బరమేశా॥

మ॥ సతిభర్తంబలె, సేవకుండును నిజస్వామింబలెన్ మిమ్మునే
నతిభక్తిన్ వెరనమ్మి కొల్చుటగదయ్యా! నాదుపా; లాపయిన్
దతవాత్సల్యతవత్స! యన్యుఁడవె తథ్యంబీవె నేనంచుదె

ల్పితగఁ బ్రోచుట నీకుపాలు శశిమౌళీ! ॥

మ॥ కరిసానాంగములందొకొక్కటి నొకొక్కండంటిమున్నంధులీ
శిరపైఁ గొందఱువాదులాడిరఁట స్వస్వస్పృష్టాంగరూపంబె కూ
జరసర్వాకృతియంచు లేమతములీశా! మిమ్ము వేర్వేరుగా
ఖరులఁ బల్కఁ నిజంబెఱుంగమినతర్క్యా! ॥

శా॥ నాజాగ్రత్తయు, నాదుధీవిభవముఁ వాశక్తి, నాయుక్తియుఁ
నాజన్మాదిసమస్తమౌ శుభములన్నా నీకుకారుణ్యముల్;
తేజోభావము నేతమంబనెడురీతిఁ నావిపత్పంక్తి గౌ
రీజానీ! త్వదుపేక్షగాకలుకరయే శ్రీరామ॥

మ॥ దయతోఁ దల్లియొసంగుభక్ష్యములు చేతంగల్గునబ్బాలకుఁ
బ్రియమొప్పఁ జెలికాండ్రుసేరుదురు; క్షుద్బీడార్తుఁడైయేడ్చుచోఁ
బ్రియులెందుఁగన; రట్లు చుట్టములుతండ్రీ! నీకృపంగల్గియుం
తయురా, వత్తురు, గానరారిడుమలైనన్॥

మ॥ జలదానీకము వర్షమిచ్చుట, సరస్వద్వారిసంచారినా
కలుగమ్యస్థలులందుట, ల్ప్లవనుచేఁ గల్గుంగదాయుల్లమీ
లలితానుగ్రహకారణైకఫలము, త్వంఘ్రీమనుష్యాళికాం
క్షలు; యత్నంబునిమిత్తమాత్రము మహేశా॥

మ॥ ఒకయల్పంబగు కార్యముఁ మనుజుఁడెట్లోచేసియాత్మస్తుతుల్
బ్రకటించుఁ జగమెల్ల; నీవునిఖిలబ్రహ్మాండసర్గాదికా

ర్యకలాపంబాకరుండ చేయుచుఁగనన్ రాకేందుమన్ నీదుసా
మ్యకదయ్యా! నిరహంక్రియాపరత సాంబా॥

మ॥ ఘనవిజ్ఞానులు సత్ప్రమత్తులు సలంకర్మీణులౌ నావిక
ల్పనరాశిన్ నడిపించునోడలగతిన్ బ్రహ్మాండముల్మింటఁబో
వుగొడన్ దాఁకిపరస్పరాహతుల నెప్డున్ జేటులం జెందనే
మనవచ్చున్ భవదీయసన్మహిమ సాంబా॥

శా॥ నీమూర్త్యష్టకమందొకానొకటియౌ నిస్సీమయౌవ్యోమమం
దేమూర్తై ననుదిం డెశేఖరమయూఖేందుగ్రహర్క్షావళీ
భూమ్యంభోఽథవాండకోటులు మహాంబోరాశినాకాగణ
శ్రీలొప్పారన్ బహుధాఁజరించినఁగపర్దీ!॥

మ॥ అతిబుద్ధీంద్రియమౌ భవద్విరచితాజాండాళిపైనద్భుతో
న్నతిలోరాజిలు మీస్వరూపమును ధ్యానంబెట్లుగావింతు మా
శ్రితరక్షామణి! మామకేంద్రియములుర్వీలోకభాగైక సం
గతిచేశృంఖలితంబులయ్యె నకలంకా॥

శా॥ అస్తోకార్క సహస్రభాసిభవదీయామేయతేజఃస్ఫుటా
విస్తారంబు సమస్తమౌజగములన్ వెల్గించియుంతర్బహి
ర్విస్తంద్రంబయియుండ నూరకయసందేహించు దుర్మేధసు
ల్నాస్తిక్యాంధులెపో దివాంధములచింతా॥

మ॥ అకలంకాద్భుతరూప! నీ దగు నమేయప్రాభవంబంతొ కిం

చొకగ న్రొన్న సుపూక, సత్కవియగన్, శోధించి సమ్యక్పరీ
క్షకబుద్ధిన్ గన నీమహామహిమ కాశ్చర్యంబునన్ మన్నిధూ
రికవీంద్రుండును మూకయై తనరుఁ దండ్రీ॥

మ॥ ఇలపైఁ గాముకుఁ డొక్కసుందరినిఁ దానీక్షించి తచ్చేష్టితం
బులనెల్లన్ దనకై యటంచుఁ దలఁచున్ మూఢాత్ముఁడై; యట్లె నీ
చెలువొప్పారెడు సృష్టిలోఁ గలుగు వైచిత్రిన్ మదర్థంబుగాఁ
దలఁచున్ గాని యెఱుంగ, నీతలపనంతా॥

మ॥ సురునైదాఘరవిప్రభాపటలిఁ గల్గున్ జల్లనౌ తోయదో
త్కర, మావారిదపంక్తిచేఁ గవిఘాతంబు వ్యైసన్ గల్గు న
ట్లరయన్ దుస్సహదుఃఖహేతువులు సౌఖ్యాంతంబులౌ, దుఃఖసా
గరమున్ జేయు సుఖైకహేతువుల తర్క్యా॥

మ॥ జననీగర్భము పూర్వరంగమగుచున్ జన్మంబునున్ నాందిగాఁ
గనుభూమిన్ సుఖదుఃఖముల్ తెరలుగాఁ గాంతాత్మజుల్ సోదరు
ల్ముఖ్యపాత్రంబులుగాఁగ సంసృతిసమాఖ్యానాటకంబాడఁ జే
రినవాఁ; రప్పని దీరఁ బాయుటరుదే?॥

శా॥ నారాజువ్వలఁ జేయువాని క్రియఁ దథ్యంబింతకాలంబు వి
రీరీతిన్ బ్రభగాంచి నేలఁబడుఁడంచేర్పాటుతో దేహులన్
సారంబొప్ప సృజింతు గాక, యవి నైజంబైన దేహంబుతో
నేరాజిల్లిన నింతలోఁ జెడునె తండ్రీ!॥

మ॥ తరిచుక్కానికిఁ బోలెఁ బూరుషగతు ల్తథ్యంబుధీవశ్యమం
దురుగా కవ్వఁడు నావికుండగుచుఁ దద్బుద్ధిణాబురాజన్మదు
స్తరకర్మౌఘఫలాంతరీపములకుం దాఁ జేర్చు నవ్విశ్వబం
ధురమూలంబగు నిన్ను గానరుజడాత్ముల్॥

మ॥ అనఘా! యల్పములైన కీటముల నానాంగావళీశిల్పము
ల్గనఁ జెల్లంబగు సర్వభూతములపైనన్ నీదుకారుణ్యనిం
దునపున్ గ్రంథములేటికిం దెలుప ముంజేనున్న దౌ కంకణం
బునకుం దర్పణమేలచూచుకొన శంభూ!॥

మ॥ అవనిన్ శైలదృఢంబులై వెలయు దేవాగారముల్గూల్ప హే
తువుగా నెంతటిమఱ్ఱిగింజ; గననెందున్ గారణాపేక్షలే,
కవుసర్వంబు ద్వదాజ్ఞఁ జేసి; యిఁకనయ్యా! కాకతాళీయమ
న్నవిధిన్ జెల్లును దృశ్యహేతువులచింత్యా!॥

శా॥ చేతంగానతఁ డీదఁబోయియడుగుం జెందుంగదా నీటనా
రీతిన్ గంజభవాదులైనమదిఁ బర్కింపంగలేనట్టిదౌ
నీతత్త్వం బెఱుఁగన్ బ్రయత్నపడి స్వామీ! శుష్కదుస్తర్కసం
జాతోన్మాదుఁడగున్నరుం డెఱుఁగకేశా!॥

మ॥ ధనపూర్ణుండగు బేరిసంచి మొదలర్థంబిచ్చి ప్రారంభకున్
మనుచున్; దద్గతి జీవమిచ్చితివి దీనంజేసి సత్కర్మశో
భనలాభంబులు గూర్చి వృద్ధిఁగని సర్వంబున్ ద్వదంఘ్రిద్వయం

బుననర్పించినముక్తుఁడౌజనుఁడు శంభూ!॥

మ॥ అవనీనాథుఁడొసంగు స్వల్పభృతికై ప్రాణంబులర్పించిశూ
రవరుల్తీరుదురాఋణంబు; తనువుఁ బ్రాణంబు జ్ఞానంబు మో
క్షవిభూతిన్ దయసేయునట్టి దొరవీశానీఋణం బెట్లు దీ
ర్పవశంబౌ నిజనీవతెల్పఁగదధీరా!॥

శా॥ చేలంగోసెడివారిపాటరని యాక్షేత్రేశ్వరుండిచ్చునా
లీలందావకశాసనంబులను మౌళిన్ బూనిమాచేయుకృ
త్యాలింగాంచి తదర్హమౌఫలమునీయం గర్తవీవౌదుగా
కోలిన్ మేముగొనన్ స్వతంత్రులమె శంభూ॥

మ॥ కరిమార్గంబునకడ్డమై తెగిన నూత్నంబైనదారంబులన్
ద్వరతోమానక మాటిమాటికినిలూతల్పన్నుచందంబునన్
హర! మీయాజ్ఞలకున్ విరుద్ధగతులై వ్యర్థలౌ నాశలన్
దిరుగన్ గూర్తురు మానవుల్ హృదయవీథిన్॥

మ॥ తొలుతన్ బాష్పముచేహిమంబుకణసందోహంబుకల్పించుచో
భిలురత్నంబులయట్లహార్యముఖమునన్ వెల్గించిమధ్యందినో
జ్జ్వలకాంతిన్ హరియించు భానునిక్రియన్ బ్రహ్మాండసృష్టిస్థితి
ప్రలయంబుల్బ్రవరించు నీమహిమసాంబా॥

మ॥ స్థిరసంపన్నతమత్తులై యధికృతుల్దీనప్రజన్ వేచుచోఁ
ద్వరమై రాజధికారులన్ నిజపదభ్రష్టాత్ములన్ జేయువై

త్పరి నీసృష్టినిఁ గగ్గులు ప్రాణులఁ గలంగం జేయువారిం బరా
త్పరి! యింద్రాదులనైనఁ గూల్తువు మహాత్మా!॥

మ॥ అవనిన్ గన్నులు లేని కౌతొకఁడు దుష్టాశ్వంబు పైనెక్కి న
ట్లవివేకాంధుఁడు సంపదల్గని వృథా వ్యాసక్రియాఘుం బొన
ర్చి వెసం దాను నధోగతిన్ బడు నుతంత్రీ! కావునన్ మాకు మా
ల్యవివేకస్వ మొసంగు మన్యథన మేలా!॥

మ॥ అనఘా! నీకరుణాకటాక్షమునఁ గాక జ్ఞానవిస్ఫూర్తమం
బు నివృత్తంబయి జ్ఞానదివ్యమణిదీప్త్యూనఁ గావచ్చునే
ఘనపూర్వవ్యసనకుంభికుంభపుటజాగ్రన్ముక్తాళిసిం
హానఖాగ్రంబునఁ గాక వెల్వడునె సాంబా॥

మ॥ హిమరుగ్మండలమందు భానుకరసంపృక్తాంశ మే సత్కళా
రమణీయత్వము నంది శేషము గనన్ రానట్లు విశ్వంబునన్
దిమ కారుణ్యకటాక్షపాత్రమగు ధన్యశ్రేణి రాజిల్లు న
న్యమును స్వావస్థయున్న లేనిదగునన్నా॥

శా॥ నీకారుణ్యకటాక్షబాహ్యహృదయానీకంబు నంతెల్లన
స్తోకాజ్ఞానతమాలకాననచరత్క్రోధాతిదుర్గ్రహాలో
భాకాగ్రోగ్రవ్యాఘ్రాళి సాత్త్వికగుణాఖ్యానై చికీలోకమున్
సాకల్యంబుగఁ బట్టిచంపునఘనాశా॥

మ॥ సకలోర్వీజనముల్ స్వనాశులు తత్సంరక్షణార్థంబవా

రకృపాదృష్టిని మీకొసంగునధికారంబే కృపాలత్వమం
చకలంకక్రియఁదామెఱుంగక ప్రజన్ స్వార్థంబుకై వేచుపా
తకులౌరాజుల నీవుకూలుతువనంతా॥

మ॥ క్షమపైనన్ మిహిరోదయాస్తమయము ల్బర్చింపఁగాభూపరి
భ్రమసంజాతములౌగతిన్ స్థిరతరత్వద్దివ్యరాజత్కృపా
రమహాకున్ గలుగున్ దొలంగు భవచక్రభ్రాంతిచే నీపదా
బ్జముమాడాయుచుఁ బాయుచుంటఁబరమేశా॥

మ॥ కరకాఫేనతుషారనీరజలము గ్బాష్పాదిరూపంబులన్
ధరయున్ వ్యోమము నిండియుండెడు పదార్థంబామ్లనూవారినూ
వరవాయుద్వయయుక్తిచేనయిన యాభంగిన్ భవన్మాయయుం
బరమా! నీవునుగూడ విశ్వమగుసాంబా॥

శా॥ ప్రారబ్ధంబున నాపదల్గలిగినన్ ద్వద్దివ్యనామంబు నే
పారన్ సంస్మరియించు సాధువులనయ్యా! రోగయానర్భకుం
గారుణ్యంబునఁదల్లియట్లు విడువంగాఁబోక నీసత్కృపా
ధిరక్షించుచునుండు నేమరక తండ్రీ!॥

మ॥ తమచిత్తంబులఁగల్గు నన్యధనకాంతాలోభముల్దీర్వలం
చముగాఁగూళలుత్వత్ప్రతీకలకు నర్చల్సేయుహర్షంబుతో
క్షమగావింతువె, జారునిన్ గవయుకాంతన్ జాయమాయోపచా
రముసేయంబతిసేచునే యొతిఁగిధరా!॥

మ॥ కుమతుల్గొందఱు సాధుసద్వ్రజజనక్షోభంబునన్ దెచ్చుద్ర
వ్యముతో మీకనియుత్సవంబు నొనరింపన్ బూనుటల్ భృత్యుఁడ
ర్థిమహారాజును విందుకైఁ బిలిచి తచ్ఛ్రీమాస్పదాపత్యమాం
సము పెట్టించినయట్టిచందమగు నీశా॥

మ॥ మతముల్కోటులు; వానికెల్లఁ బరమాత్మా! ప్రాణముల్మీకుస
మ్మతముల్ రెండు ప్రధానధర్మములు; యుష్మత్పాదపంకేరుహా
శ్రితమానిశ్చలభక్తి, సర్వతనుధారివ్రాతమున్ సోదరో
చితవాత్సల్యమునం గనుంగొనుటయున్ శ్రీరామ॥

మ॥ చెలువౌ తేనియనిండినట్టి తెరలై చెన్నారు నాచిత్తమున్
బలుజంటీఁగలుపోలె నైహికములౌ వాంఛాళి దట్టంబుగా
గలయంగ్రమ్మెను; వానిఁద్రోలి దయతోఁ గైకొమ్ము సద్భక్తియు
న్నలితంబౌ మధుధారదంభశబరేంద్రా॥

శా॥ కామక్రోధభయాదివాతనిహతిన్ గంపించు నవ్వేళనీ
నామం బేగద మన్మనోలతికకున్ మారాకు; గావన్ భవ
న్నామంబున్ విడనీక నామతిని సన్నద్ధంబు గావింపుమా
స్వామీ! నీదృఢభక్తిరజ్జువుల సాంబా!॥

మ॥ వెసఁ బైఁబర్విదివాకరాంశువులు మున్వెల్గింపకున్నట్టియా
దెసమా నేత్రయుగంబు వ్యర్థమగురీతిన్ మీయలంఘ్యేచ్ఛచే
నెసఁగన్ సిద్ధములైనకార్యములకుందే గాక మాకోర్కులా

క్కుసుమంబైన ఫలించు నేతలఁ బఁతంద్రీ!॥

మ॥ తనివిన్ దానొకచోటనిల్వక, నిజద్రవ్యాంగనాభోగస
మనుదాఁటన్ జనుమాటికిన్ బశుపతీ! మళ్లింపవేయుంచుధీ
నిని బల్బంధెలమారిచిత్తపశువున్ నేనీవనర్పించితిన్
జెనఁకింగాచుటకష్టమంచనకుమా శ్రీరామ॥

మ॥ అనఘా! దుర్గతియన్నభీతియగు; నేదైనన్ సుకర్మంబుచే
సినఁ బాపంబులుబాయు; మళ్లుడనినన్ సీయున్ననున్ గోసికో
యని మొండుల్గద మామకేంద్రియములభ్యస్తాన్వముల్మానఁబో
వునమస్తేదయసైపుమన్నియునుదప్పన్॥

మ॥ పతితుండీతఁడటంచునన్ బశుపతీ! పాలింపకుండేనియీ
వితయాగాయముబెంపనేమిటికిఁకన్ వేదీనివర్జించియా
పతిబోలెన్ ధృతిబూనినన్ గనియెదన్ దేహాంతరంబఁదునా
ప్రతినన్ జూచెదవేమొచూడుము కృపార్ద్రా!॥

శా॥ ఏదోముందటఁ బెన్నిధిన్ గనినయట్లే ప్రక్కకున్ వెన్కకున్
మీదున్ జూడక యింద్రియానుచరులై వేదిష్టమైపోల్చునీ
పాదాబ్జద్వయినీడఁజేరి సుఖయింపన్ లేక యీమానవు
ల్పొందుర్దుర్గతికిందగో తుదపశంభూ॥

మ॥ తనకుంబెట్టినతోయమే యితరపుత్త్రశ్రేణికిన్ దల్లియి
చ్చినదేమో తనకంటెహెచ్చుగఁబరుల్ చేపట్టినారంచువా

రిని యాచించెడుబాలురీతినగుఁ దండ్రీ! యాత్మసౌఖ్యంబునన్
దనియంజాలక కోరుటన్యసుఖమొందన్॥

శా॥ తానెవ్వాఁడు సదాత్వదీయచరణధ్యానంబునిల్పంగలేఁ
డానిర్భాగ్యునిదైనభాగ్యమొకభాగ్యంబే; ప్రదీపప్రభా
హీనంబౌ గృహమర్థసంచయముచే నింపారఁ దానిండినన్
దానం గేహికి నేమిలాభమగునన్నా!॥

మ॥ అనురాగంబుసుఖేచ్ఛసంకెలలు, జాయాపత్యమిత్రప్రసూ
జనకాదుల్ దనుఁగాచుకింకరులు, సంసారంబుకారాగృహం
బనఘా! పూర్వకృతంబునేర, మజుఁడున్ న్యాయాధికారుండుగాఁ
దనరంజేసితి నేదిరాజకృప? నాధా॥

మ॥ నినుదాఁ బేర్కొనవచ్చు మాటికిని, మైనిండారఁగాబూదివూ
సినసుంబూయఁగవచ్చు; బద్యశతముల్ జెప్పంగనువ్వచ్చు గా
కనినున్ నన్నును వేరుసేయురిపులన్ గామాదులన్ దంభశీ
లునకున్ సుంతయుఁ గెల్వశక్యమె? కృపాఘా!॥

శా॥ సత్యంబున్ క్షమలేక క్రోధమదమాత్సర్యాదులన్ మానఁబో
కత్యుగ్రంపుఁదపంబుసేసినను వేదాంతంబులన్ సూత్రము
ల్నిత్యంబున్ బఠియింపముక్తుఁడగునే? నీరోగియౌనే? యప
థ్యత్యాగక్రియలేనియౌషధముచేతన్॥

మ॥ చదువుల్పెక్కులు నేర్చి పండితసమజ్ఞంగాంచినన్ శాంతిసం

పనచిత్తంబునఁ గాంచలేఁడు మమతామర్షాన్యశాలాపను
ల్వాపలన్ లేనతఁడెంత పెంపుగనినన్ వంధ్యాసువిద్వంద్వము
దుదయంబొనెపయుస్సుధారసము శంభూ!॥

మ॥ ధనమత్తుల్మెయివంచలేక తమకైత్వత్పూజలన్ సల్పఁగా
ననుపన్ జూతురు కూలికన్యులను, శయ్యన్ భర్తసేవింపదా
సినిన్ బంపఁపనకబ్బునే రతిసుఖశ్రీదోహృద్రప్రీతియున్
మనుజాక్షేశునిరాణికైనఁబరమాత్మా!।

మ। ఉరుకూలంకషమైనయేటితిటియందున్నట్టి యూళ్లట్లుగు
త్తరనిత్యోగ్యగువిపన్ముఖస్థములు మాజన్మంబు; లౌటన్ నిరం
తరనిర్నిద్రతనీవుమమ్మరయుచున్నంగా కుపేక్షించినన్
బరమా! యింతనిసున్నమాబ్రతుకులెన్నన్॥

మ॥ ధనకాంతాఘనతృష్ణచే భవనదిన్ దాయంగ సంతుష్టినాఁ
జనుతద్రోధముకూలినంబటిశుకై చందత్ప్రవాహత్వరన్
జనుచున్ గుయ్యిడుసిప్రజన్ మనుపకన్నాకొండకైనుండిచూ
చినఁ గీర్తింతురెనిన్నుదొడ్డనోరగా॥

మ॥ అనువొప్పారఁగనీత నేర్పుజలమధ్యంబందునన్ ద్రోచిపు
త్రునిశక్తింగనుఁగాక; చేష్టశువెడన్ ద్రోవంగరాకుండు నే
జనకుం, డట్లుభవాబ్ధిఁద్రోచితివి మాసద్భక్తిధైర్యంబుమ
ల్లనఁజిక్కన్ సెడనీవగిన్కన్ శితిరక్షా!॥

మ॥ కనుచుండన్ గనుదమ్ములం బొదవదే గాఢాంధకారంబు నె
ట్టన నిద్రాహ్వయమూర్ఛలో మునిఁగియుండన్ భానుభాతిస్ఫూర్తియొ
య్యావగిల్గింతలఁ దానె మేల్కొలుపదే యాఁగీలసంపత్తియున్
గనుచుండన్ జను, వచ్చునా సచెడియుండన్॥

మ॥ శనితాఁ జాలకయున్న నొక్కతరియుమ్మల్లింగ తైలాభిషే
చనమా కీశు తొలంచుమన్న నికఁ బ్రాంచద్భక్తిసుస్నేహధా
రనవిచ్ఛిన్నముగా భవచ్చరణముల్ ప్రాజ్యాభిషేకంబుచే
సినపుణ్యున్ గ్రహచారముల్ బ్రహవునే॥

మ॥ భువి మమ్ముం దివ గోరు ఘాతుకమృగంబుల్ వైకుఁగొట్లున్న వ
య్యావి మమ్మింతయుఁ దేరిచూడవు త్వదీయాజ్ఞావిధేయంబులై;
దివి పైనీకనుసన్నలన్ మెలఁగు నాదిత్యాదులెగ్గేలకో
రివృథా సేతురు మాకు? సర్వసమదర్శీ!॥

మ॥ అతిభీమంబగు యుద్ధకాలమున నైజాస్త్రింబు లేజోదువి
స్మృతిఁ జెందున్ జెనువారెఁ; జాపగది రామా శ్రీనామమంత్రంబు దా
మతిలో నెవ్వండు విస్మరించు బరమాత్మా! యాతఁడీశ్యోరసం
స్మృతి జున్ సంగరమందు భంగపడు ధాత్రిన్॥

మ॥ అమితాజ్ఞానతమంబులోన, భవపారావారమందున్ బహు
శ్రీమతో నేఁదను నౌకమున్ గడుపుచోఁ బ్రారబ్ధవాతానుకూ
ల్యము దప్పెన్ గృపతోడ నా మదికి మీయంఘ్రిస్మృత్యాంబద్ధల

ష్యము దప్పించు నఘౌఘముల్ దొలఁగుపుమ గామ్యా!॥

మ॥ ధనముల్ మించుబుణంబుగల్గునతఁ డాత్మద్రవ్యముల్ దాఁపఁబో
కని వేదించిన న్యాయదర్శిబుణమోక్షుం బ్రసాదించు నా
తని; కేవట్లు మదీయపుణ్యకణముల్ ద్వత్పాదపద్మార్పితం
బునొసర్తున్ దురితాబ్ధిన్ గడుపు కంధూ!॥

మ॥ ఇల నేరీదెడు నాతఁ డొక్కఁ డరి నెన్నెసుల్లలోఁ బడ్డనున్
జలితుండై యూడుపంబు దావిడువఁ బున్నంబారముం జేరున
ట్టుల సంసారపు బేటి నీదెడు నరుండున్ జిక్కుఁడా పత్తులన్
లలి మీపాదము వీడకున్న మతిలోనన్ రామ॥

మ॥ తనకున్ వేరుహితాభియాతులు; బురాత్తం బైనకర్మంబు పే
రునఁ జేరొన్న బుణంబు బాపికొనశక్రుల్ గ్రుంకులన్ ధాత్రిలోఁ
దనకుం దోడ్పడువారు; ద్వేషమెభవత్పాదద్వయిం బాపి సా
మనముం ద్రిప్పెడు లోని దాయ పరమాత్మా!॥

మ॥ ఘనమై దాఘురవిప్రితప్తధరణీఖండంబునన్ వర్షము
ట్లనలజ్వాలలఁ గ్రాఁగి యొట్టినగులోహంబందు నీరట్లు చే
సినసత్కర్మయు నిష్ఫలంబయి చనున్ సిద్ధింపఁగాఁ బోగుప్రా
గ్జనిసంపాదితపాపదగ్ధునకు నీశా॥

శా॥ త్రోవల్గన్పడు దుండు నెందు; మఱియొందుం బాశముల్గానఁగా
రావోకీర్యంచుకయైననున్; భవనదీప్రాంచద్దయాధనుఁడై

పాపంబోవఁ బరాగమార్జితసముద్భూతాపదానాయము
జ్జీవశ్రేణినిగ్రహమ్మునంతదనుకన్ శ్రీరామ॥

మ॥ నిను ధ్యానింపఁగ జేయు నాపదలకంటెన్ సంపదల్లేవు సె
ట్టన నీ సంస్మృతి మాన్పు సంపదలు గూఢంబౌదువం తాపద
ల్లు నమాదౌహృదజాతఖేదమును సౌఖ్యంబౌను; వంధ్యాసతీ
జన సౌఖ్యంబును దుఃఖమూలమగునీశా॥

శా॥ ఇల్లుం దల్లియుఁ దండ్రియుం గురుఁడు ధాత్రీశుండు వైద్యుండు సం
పల్లాభంబు సుతాదిబంధులు హితుల్ ప్రాణంబులున్ నీవ నా
యుల్లంబందునఁ బ్రేమభక్తిభయధైర్యోత్సాహసంపత్తులీ
యెల్లం గల్గు నిమిత్తమూ వకదతండ్రీ॥

మ॥ అమితాజ్ఞానము రోపఘుట్టముతు. సోద్యన్నశ్యదామోదఖే
దమునా సంసరణంబు బాసి మిము నాత్మన్నిల్పు వాఁ డంధకా
రమహావాతతటిత్ప్రవర్షయుతవర్త్మంబాసి మిద్దంబ్రదీ
పము వెల్గన్ నిమరించుహాయిగ నునొప్పన్॥

మ॥ అనఘా! నీమహిమార్హమైయమరు పేరా వేదముల్గానలే
క నెఁబర్జవ్యక్రుషానిలానలసహస్రాంశుత్వషేశాంబురు
జ్జనివిష్ణాగ్రులటం; చవెల్లఁబరమేశా! నీకపర్యాప్తము
న్ననికేఘున్నది నిన్ను చెల్పఁగ నచింత్యా!॥

మ॥ వనజాక్షాగులకైన నీమహిమముం భావింపఁగా రాదు; వ

చ్చినలేశంబును గోటినోళ్లనయినం జెప్పంగరాదేరికిన్
నిను నేవర్ణన సేయు టెట్లు మదినన్నే నీకు వర్ణింతునం
దునో సర్వజ్ఞుఁడవీవు నేనెఱుఁగనన్నన్॥

శా॥ ఆస్వాదించిన జిహ్వకుం బలుక శక్యంబే మిగా దారుచిన్
భాస్వద్భంగి నినిండి ఘ్రాణపుటము నొప్పం బట్టదా మోదముం,
ప్రస్వేదోత్పలకాంగముం దగ భరింపఁ జాలదా మోదమున్
నాస్వామీ! నినుఁ జిత్తమందుఁ గనుగొన్నన్॥

మ॥ వెతకన్లేదుపమాన మొక్కటి జగద్వీధిన్; స్వభావోక్తి ప్ర
వ్యాతరంబే నినుమంతగాదనఁగ దూరాపాస్తమత్యుక్తి, యిం
కితరాలంకృతు లెట్లు జాలుఁ గనఁ దండ్రీ! నిన్ను వర్ణింప, యో
గ్యత మం బొక్కఁటి యనన్వయంబె తలపోయన్॥

మ॥ వశివర్యుండగు కూచిమంచికుల భాస్వత్క్షీరవారాశిప
ర్వశశాంకుండగు సోమసుందరకవిస్వారాజు మాతండ్రియై
చ్చె శుభప్రక్రియ మీకు సత్కృతులు తచ్ఛిష్యుండఁ బుత్త్రుండ సాం
బశివాఖ్యుండను దీనిమత్కృతినిఁ గొమ్మా రామలింగేశ్వరా!॥

మ॥ క్షితిపైఁ బల్వలకొప్పలింగఁడని నిన్ గీర్తించుచుం గీర్తన
ల్కృతముం; దండక మొక్కటిన్; శతకమున్ సద్భక్తచింతామణీ
శతకంబున్ రచియించ నాదుపితయుష్మత్పాదపంకేరుహా
శ్రితముంగా నొనరించి ధన్యతఁగనెన్ శ్రీరామలింగేశ్వరా!॥

శా॥ హాలాణాబ్దంబులు వేదచంద్రదవిధి భూయుక్తంబులౌసంఖ్యఁ
శ్రీణానంద సమేపకృష్ణదశమీ శీతాంశుపుత్రాహమం
దైణాంకౌచ్క్రముగాఁగ నూటపదియారర్పించితిఁ బద్యముల్
వాణీనాథముఖామరార్చిత పదాబ్జా! రామలింగేశ్వరా!॥



